శ్రీ

నిర్గుణపరబ్రహ్మణేనమః.

# పంచబంధవిముక్తి.



ఇది

## వరదా సూర్యనారాయణ

ప్రకటితము.

మొదటికూర్పు 1000 ప్రతులు.



రామమోహన ముద్రాక్షరశాల, ఏలూరు.

1915.

శుభమస్తు.

శ్రీనిర్గుణ పరబ్రహ్మణేనమః.

# పంచబంధవిముక్తి

యను

---

## అచలగ్రంథము.

ఇది

శ్రీమద్వరదావంశ పయఃపారావార రాకాసుధాకరులును పండితాగ్రేసరులునగు తమ్మయాభిధేయుల పౌత్రుండును, సకల సద్గుణ శ్రేష్ఠులైన అచ్చయాఖ్యుల పుత్రుండును, మాతృపితృభక్తిపరాయణులగు తమ్మయార్యుల కనుజుండును షడామ్నాయదీక్షానిష్ఠులును వేదవేదాంగ విద్యానైపుణ్యులును బ్రహ్మవిద్యానిష్ఠాగరిష్ఠులును నగు శ్రీమత్పట్నాల రామయోగివర్యుల దౌహిత్రుండునునైన

సూర్యనారాయణచే

రామమోహన ముద్రాక్షరశాలయందు ముద్రింపించి

ప్రచురింపబడియె.

ఓమ్

# శ్రీసద్గురుపరబ్రహ్మణేనమః.



“ సద్రూపంనాస్తిసర్వత్ర చిద్రూపంనాస్తిసర్వదా। ఆనందరూపకంనాస్తి అచలంచాస్తిసర్వదా। సర్వానందవిహీనంచ అచలోయంసనాతనం। ఆనందరహితమచలం కర్తుకార్యవివర్జితం। జ్ఞానమానందగంబ్రహ్మ ఇత్యుక్తంమూఢమానవైః। జ్ఞానాత్సంజాయతేనందో ఆనందోభ్రాంతిలక్షణః। సత్యజ్ఞానమనంతంచ మాయాగుణమిదంశ్రీణు। నిర్గుణంనిశ్చలంపూర్ణం సర్వకాలేషు సంస్థితం। జాగ్రత్స్వప్నసుషుప్త్యాది అవస్థాపంచకంసహి। సర్వకాలేసదావ్యాప్తం సర్వదేశేషువ్యాప్యృతం। నిష్క్రమం నిర్మలంశుద్ధం అచలంశబ్దవర్జితం। తేజోంధకారరాహిత్యం గోప్య బ్రహ్మణసంశయః। సచ్చిదానందరూపత్వం మాయా ఇత్యభిధీయతే ” అనిపలుకుచున్న ఉపనిషత్ప్రమాణానుకూలంబుగా సంపూర్ణత్వమునొందియచలగురుస్వాములయిన శ్రీరామమడుగు శివరామ దీక్షితులు వారిశిష్యపరంపరలో గణనాతీతులయిన శ్రీనారాయణ గురుస్వాములవారికి ప్రియశిష్యులును విజరపువంశకలశార్ణవ శరద్రాకాసుధాకరులును జ్ఞాననిష్ఠాగరిష్ఠులును, అద్వైతసిద్ధాంత దేశకులును, అచలపరిపూర్ణనిశ్చయ సంపత్ప్రకాశమానులునై కొందరిశిష్యులచే శంకరానందులనే పర్యాయనామంబుచే నొప్పుచున్న శ్రీశంకరాచార్య స్వాములవారి శిష్యసమూహములో నొకండనైన నేను

(అశరీరం సర్వదా అస్తి అశరీరంరహితం సదా అయమేవ సదా ముక్తిః। అన్యదా భ్రమకారణం, అను న్యాయమును పొందియున్న అచలభావజ్ఞునిచే రచింపబడిన పంచబంధ విముక్తియను గద్యపద్యాత్మకంబగు నొక్కచిన్న ప్రాచీనగ్రంధము రచించుటచే దీని నచ్చొత్తించినచో। శ్రీగురుపాదారవింద సంసేవ ధురంధరులకే గాకయెల్లమానవులకు రాగద్వేషాదులడంచి మోక్షాయత్తులంజేయునని యోచించుచుండగా (భర్తూణామేవ శుశ్రూష స్త్రీణాం ధర్మస్సనాతనః। నార్యోవిష్ణుపదంయాంతి పతిశుశ్రూషయైవహి॥ పతివ్రతాంస్త్రియంస్పృష్ట్వా ప్రణమన్త్యమరా అపి। అని కాత్యాయన ఋషి వచనప్రకారం। స్త్రీలకుతమభర్తయొక్క సేవయే ముఖ్యమైనధర్మము. అట్టిధర్మమునాచరించిన స్త్రీలు పతిశుశ్రూషమాత్రముననే సాయుజ్యపదవినిం బొందుచున్నారు. అట్టి మహాపతివ్రతలకు దేవతలయిన నమస్కరింతురు. అట్టిస్త్రీరత్నములలో శ్రేష్టమై శాంతశమదమాద్యనేక కళ్యాణ గుణగణాలంకారిణియు, మనోవాక్కాయములనే త్రికరణసాక్షిగ భర్తకు చతుర్విధ శుశ్రూషలంజేయుచు క్షీరోదకన్యాయంబున వర్తిల్లుచుండ నమ్మహా పురుషుండిహలోక సౌఖ్యంబులంబాసి పరలోకవాసుండైనను పతిపాదధ్యానపరాయణురాలై అతిధి అభ్యాగత సత్కారంబుల నెరవు (సత్యవాక్యోదృఢవ్రతః) అనే న్యాయవాక్యనిరూఢింజెందుచు శ్రీమన్నారాయణ శబ్దాతీతమయిన అచలగురు పాదారవిందమరందపానతుందిల మదపదిందిరాయమానమానసురాలునై నవరత్నములలో శ్రేష్టతరమై తేజోవంతమై కొనియాడబడుచున్న మణివలె స్త్రీజనంబులలో మణినామంబున విరాజిల్లుచున్న కొత్తమాణి

క్యాంబయనే గురుపుత్రికారత్నము ప్రోత్సాహ ప్రయత్నవా
క్కులేగాక సంపూర్ణద్రవ్యసహాయమునుగూడ చేయుటచే పైవ్రా
సినగ్రంథమును యతిగణప్రాసలక్షణము నెరుగకుండినను మద్గురు
కరుణా కటాక్ష వీక్షణములవల్ల నాచే వ్రాయబడిన కొన్నితత్వ
కీర్తనలు యిందుబొందుపరచి ముద్రింపించితిని యిట్టిమహోత్కృ
ష్టమైన గ్రంథములో యీతత్వము లేలనుంచితివన వరుసవేదిసా
న్నిధ్యమందున నినుముబంగార మగునట్లు నాతత్వములకు పరిశు
ద్ధత్వముగల్గునని యెంచినాడను. ఆర్యులారా యీగ్రంథమందు
లేఖనప్రమాద జనితదోషములుండిన క్షమింప గోరుచున్నాడను.
మాగురుశిష్య గణనాతీతులయిన బ్రహ్మశ్రీ వేములపండిత వీరేశ
లింగశాస్త్రిగారిచే సర్వగ్రంథమును నిర్దుష్టముగా పరిష్కరింప
బడినది.

ఇట్లు విన్నవించువిధేయుఁడు,

వరదా సూర్యనారాయణ.

ఓం

శ్రీనిర్గుణ పరబ్రహ్మణేనమః

# పంచబంధవిముక్తి.



వ. శ్రీమానుమద్గిరినివాసుండగు శివరామయోగీంద్రులవారు శ్రీభైరవాచలనివాసుండైన శేషమానీంద్రులవారిని ప్రార్థింపఁగా దయగలవారై సాంఖ్యతారకములు బోధించి తుదకు యమనస్కంబైన పరిపూర్ణంబుబోధించుటకై తెలియపరచిన గద్యపద్యాత్మకంబగు పంచబంధవిముక్తియను గ్రంథమునకు కథాక్రమం బెట్లనిన.

కం. వినుశిష్య పంచబంధము
లనియెడిభ్రమముళ్ళ వివరమాద్యంతముగా
వినఁజేసి యెరుకకవ్వల
నినుజేర్చెద గురునియాన నిక్కముగాఁగన్

వ. అది యెట్లన్నను మాయాపంచబంధములలో నొకటి పూర్వజన్మంబనియు రెండవది మాతాపితృలనియు మూడవది యోనిసంభవమనియు, నాల్గవది పంచభూత యుక్తంబనియు, అయిదవది పునర్జన్మంబనియు నొప్పెడి యీమాయయెరుకచే కల్పితంబైన యీపంచబంధములచే కట్టుబడి ప్రపంచంబున కతీ

తుండైన అచలగురునెఱంగక జననమరణంబులను మహాప్రవాహంబు దాటుటకశక్యంబై మునుంగుచు దేలుచుందురు గావున యీపంచబంధవిముక్తునిగాజేసి నీకు పరిపూర్ణంబైన అఖండతేజంబెఱింగించెద సావధానంబుగా నాకర్ణింపుమని పరమగురుమండైన శేషయోగీంద్రుడు శివరామయోగికిట్లనియె.

## పూర్వజన్మబంధము.

క. మున్నొకజన్మంబని మా
యన్నాశ్రమపడుట ధర్మమగునా యిదినీ
కెన్నంగలేదు సర్వము
సున్నసుమీ నిజమెఱిఁగి చూచినపిదపన్

అదియెట్లన్నను-

గీ. మాయలేకయుండు మఱియేమిలేదాయె
మాయచేసమస్త మాయగాన
మాయనరులబోధ మాయయేగాకను
మాయవలదు బ్రహ్మమార్గమగునె.

చ. మాయజగంబులన్నియును మాయనరుల్ వసుధాదిభూతముల్
మాయ నినుండు చందురుడు మాయ మహాదశమండలంబులున్
మాయగ్రహాదితారలును మాయహిమాచలముఖ్యనగముల్
మాయభవానిశంకరులు మాయగదా విధివిష్ణులాదిగన్.

సీ. వేదాగమములెల్ల వెదకిచూచినమాయ
శాస్త్రపురాణముల్ చదువుమాయ

సప్తాంబుధులు మాయ సర్వేశ్వరుడు మాయ
మతములన్నియు మాయ మనసు మాయ
బ్రహ్మాండమును మాయ ప్రణవాక్షరము మాయ
క్షరమక్షరము చరాచరము మాయ
కులగోత్రములు మాయ గొప్పకొద్దులు మాయ
తలిదండ్రులన్న దమ్ములును మాయ

గీ. స్నానసంధ్యాదిమంత్రముల్ జపతపంబు
లష్టవిధమైన యోగంబు లాదిగాగ
నెంచిచూచిన మాయకు మించియున్న
దొక్కటియు లేదు జగములో నిక్కముగను.

ఆ. గాన మాయలోన గలవారమను జన్మ
మున్న దనుచు నీకు ముందుగాను
చెప్పి మంచిబుద్ధి జెరచిరంతే కాని
పూర్వజన్మమిల్ల పుణ్యపురుష.

క. వారలుతమ కా జన్మంబారూఢిగ
గలదటంచు యనృతంబులు
నింపార గబలికిరి గానీ
కూరిమితో జూపలేరు గురుపుత్రనిధీ.

వ. కావున పూర్వజన్మంబు వాచ్యార్థంబు భ్రమణరూపంబేగాక సత్యంబుగాదనిన శేషమానీంద్రునకు శివరామయోగి యిట్లనియె

క. గురువరమును పేకను
యేతెరఁగున యీజన్మమయ్యెధీబుధనుతయిం
పరయఁగవిన్పింపఁగదె
చిరతరముగుభక్తిగల్గిసేవింతుతగన్.

వ. అనిన శివరామయోగికి శేషమానీంద్రుండిట్లనియె.

గీ. అరయస్వప్నాద్యవస్థం దద్భుతముగ
దోఁచుదేహంబులెన్నెన్నొ దొడరిగాన
వచ్చినంతటమరియునే వంక కేగు
నయ్యదియె మాలమీమాలమదియెసమము.

వ. ఇదియె పంచదశాక్షరీయర్థము కావున పూర్వజన్మం
బను భ్రమణంబు పంచదశాక్షరీయను మహామంత్రాగ్ని కాహుతి
యొనంగితింగాన మరల నిన్నంటనేరదని వెండియునిట్లనియె.

## మాతాపితృబంధంబెఱింగించెద.

క. జననీజనకులభ్రమనీ
మనమున కత్యద్భుతముగ మరిదోఁచుటనం
దనమాయ వేరెయున్నది
యనియూహింపంగనేల నదియునుగాదే.

వ. కావున మాతాపితృలనెడి వాక్యం బసత్యంబుగాని
సత్యంబుగాదనిన శేషమాని శివరామయోగికి నిట్లనియె. ఇందుకొ
క దృష్టాంతముజెప్పెద వినుముని యిట్లనియె.

క. వీరలె తలిదండ్రులనని
కోరిజనించితివా వారుగుర్తెరిగినినుం
గారవమున గనినారో
యీరీతిని దెలియమాయ దృష్టాంతమిదే.

వ. కావున మజ్జననీజనకులని నీవెరింగి వచ్చినది గాదు. పుత్త్రుండని జననీజనకు లెఱింగి తెచ్చుకున్నది గాదు ఇందుకు దృష్టాంతంబు జెప్పెద అట్లెరిగియున్నయెడల.

చ. కలిమికులంబు గోత్రమును గౌరవముల్ యతిశీలమాదిగా
గలుగుసమస్తసద్గుణని కాయముగల్గిన వారిబిడ్డలై
గలుగక హీనమానవుల గర్భజులై పడి పంచలందు
వెంగలులుగనుండ వేఱులయి కల్గుదురే మనుజ్ఞానమొండినన్.

వ. అదియునుంగాక అట్లాజననీజనకులు ఎఱింగియున్న యెడల.

గీ. రూపురేఖవిలాసంబు రూఢిమెరయ
తెలివిగలబిడ్డలను వారు దెచ్చుకొనక
మూఢులత్యంతమూగ సమున్నతులగు
సుతులగాంతురె దెలసిన సూరిజనులు.

వ. కావున సమూలంబైన విశ్వరూపిణియగు మాయచే కల్పితంబైన బంధరూపంబె గాని సత్యంబుగాదనిన శేషశాస్త్రీంద్రునకు శివరామయోగి యిట్లనియె.

మ. తలిదండ్రుల్ భువిలేక పుట్టుటయు తథ్యంబైన యీబైబ్బలులో
వలయీదేహముః పుట్టరాదె యిదినింపారం స్వైకాధీనమై
వెలయన్ గారణమేమి దెల్పుమది వేదంబుంబుట్టగామాని
రాటుంలజా నన్నలయించు మాయ నెరుకన్ మాలింపవే
సతత్పృవన్.

వ. అని యడిగించిన శివరామ యోగికి శేష మానీంద్రుం
డిట్లనియె

గీ. మాయగాననిదియు మరియొకంయాధీన
మగుచుమచ్చుపోవుటంతె కాని
రాకపోక లెరుగరాదు బ్రహ్మాదుల
కైననాదుముద్దులయ్యవినగ.

వ. కావున నీపెను మాయ అదృశ్యంబగు కాలంబున గ్రహ రోగ, సర్ప, వృశ్చిక, వ్యాఘ్ర, కూప, తటాక, మహీజాతుల యందు నెపంబుండుటయేలాగో ఆక్రమంబుననె జననీ జనకుల నెపంబున పరిదృశ్యంబె కాని మరియేమియు లేదనిన శేషమానికి శివరామయోగి యిట్లనియె.

క. కరచరణాద్యవయవముల్
దొరకొని నిక్కముగ మదికిదోచుటయేవో
యెరిగింపు దీనిమూలము
పరిశీలముగాగ మానిపతి రాత్రిలకా.

వ. అనియడిగిన శివరామయోగికి శేషమానీంద్రుండిట్లనియె

గీ. మరువుమరణంబు నిద్రసమాధిమూర్ఛ
లాదియైనట్టి నీయైదవస్థలందు
లేదుగావున నీ వమ్మ రాదుదాని
రూపమఖిలప్రపంచంబు రూఢిగాను.

వ. కావున మాతాపితృలను భ్రమణంబు మాయాకల్పితం
బైన బంధంబెకాని మరేమియుంగాదు.

## యోనిబంధం బెట్లనిన–

వ. తల్లిదండ్రులులేకనే యుత్పత్తియగుటంజేసి.

ఉ. కావునయోనిజన్ముడవుగావు నిజస్థితి గానలేక
దుర్భావమునన్ జడత్వమగు బంధములన్ దగజిక్కి బేలవై
జీవుడనంచు నీవిటుల చింతిలుటేల నిజాత్మదృష్టిలో
కేవలయీశ్వరాకృతిని కీల్గని యొప్పుదువయ్య శిష్యుడా.

వ. కావుననీవు నయోని సంభవుండవుగాని యోనిసంభవుం
డవుగావు. అనిన శేషమానీంద్రునకు శివరామయోగియిట్లనియె.

క. యోనిద్వారంబున నే
మానవజన్మంబటంచు మరిశాస్త్రములన్
గానంబడుచున్నదిదెగా
దీనదయా నిజముకల్ల దెలుపవె నాకున్.

వ. అనిన శివరామయోగి శేషమానీంద్రున కిట్లనియె.

గీ. అరయ సంయోగ సమయంబునందు దలచి
నప్పుడెల్లను నొకశిశువవతరించ
లేదు గావున నిజమన రాదు నిద్ర.
వచ్చినపుడెల్ల నొకకల వచ్చినదియె.

వ. అదియునుంగాక.

గీ. స్వప్నకల్పిత ప్రక్రియ జరుగునెచట
నుండియే తెంచె దృశ్యమానునరభోక్తృ
లై చటకదియోనిసంభవ మాయయోని
సంభవమైదాని మూలాగ్రసరణి దెలుపు.

వ అనిన శేషమానికి శివరామయోగి యిట్లనియె.

క. మూలములేకనె స్వప్నము
చాలగ బరిదృశ్యమగుచు సర్వంబు దగం
దేలుచు మునుగుచు నంతలో
నేలోకము కేగునదియు నెరుగుట తరమే.

వ. కావున స్వప్నంబు యోనిసంభవమని వచించుట న
త్యంబు వాటిల్లు గావున అయోనిసంభవంబె మహాత్మ యనిన శివరామ
యోగికి శేషమానీంద్రుండిట్లనియె.

క. అదియిదియొకటే యని
నీమది దలచి యఖండమైన మార్గమ్ముగని
హృత్సదనమున గురుని పదములు
వదలక సేవించ వదలు బంధము వత్సా.

వ. ఇదియునుంగాక -

క. దృక్కులకగోచరము గు పెం
పెక్కఁగ నదు గర్భమునను పెరిగిన తనువీ
దిక్కున గానక యోనికి
గ్రక్కున జన్మించినదియు గాదుదలంపన్.

వ. కావున నట్టింట బుట్టినవాడు వాకిటికి రాగానే వాకిట బుట్టినవాడా కనుక నీవయోనిసంభవుండవోయి శిష్యా యింకను పంచభూతంబులలో గూడియున్నానని యెడు భ్రమణంబు షోడశాక్షరియను మహామంత్రంబున కాహుతిగా నొసఁగెద వినుమని యిట్లనియె.

## పంచభూత బంధంబు జెప్పెద.

సీ. అస్థిమాంసముచర్మ మారోమనాడులు
నాదియానీయైదు నవనిపాలు
మలమూత్రస్వేదముల్ మరిరక్తశుక్లమా
తలపగా నుదకభూతంబుపాలు
ఆకలిమైథునం బాలస్యమాదప్పి
నిద్రయగ్నికి జెల్లునిజము గాను
పరుగుట ముడుచుట పరగనడచుట నిలచు
టాదిప్రాణము మారుతమునకు జెల్లు
ఆశభయములులజ్జ యాశిగ్గుమోహంబు
శబ్దమాకసమున కు జెల్లబోవు

గీ. గానమిగిలిన దేదానికక్రముగ నదియె
సర్వపరిపూర్ణభావమై సత్యమగుచు
వెలయునిర్మైబ్బలు దానికి వేరులేదు
షోడశాక్షరి యర్థమిచ్చోట తెలియు.

వ. కావున మూలములేక గుర్తెరిగే శరీరము ఏమిలేదనిసద్గురువాక్యంబున సత్యంబుగా దలంచి చూచిన యీపంచభూతంబులు నిన్నంటనేలేదు గావున నిక నీకు అయిదవబంధంబెరింగించెద

## పునర్జన్మబంధము.

వ. అదియెట్లనిన పునర్జన్మంబు నొందెదనని యెడి భ్రమణంబునకు శేషంబులేదుగనుక నీకుపునర్జన్మంబులేదు. మాయాకల్పితంబైన బంధంబె కాని మరియేమియులేదు. ఇకను సర్వపరిపూర్ణంబయిన ద్వాదశాక్షరి యను మహామంత్రంబున కన్యంబు లేదు ఇద్దియెదనిన నిట్లనియె.

సీ. అదిసర్వపరిపూర్ణ మదినిర్వికారంబు,
నదియెనిరాలంబ మదియెనిజము
నదియెనఖండంబు నదియెనిర్వచనీయ,
మదియెయఖండంబు నదియెనిజము
మదియెనిర్ద్వంద్వంబు నదియెసత్యజ్ఞాన
మదియెమహత్తత్వ మదియెనిజము
అదియె నిశ్శబ్దంబు అదియెనిరామయ
మదియెనిరంజనంబదియెనిజము,

గీ. అదియెకేవల మద్వైత మమలకాది
యగుచు ప్రళయంబునందైన హతముగాక
నొకరీతిగ అచలమై యున్నబయలు
నదియునీవని తలపోయు మమలచరిత.

సీ. అబ్ధిలో మునగదు నవనియందణగదు
దావాగ్ని శిఖలచే దగులబడదు
ప్రళయానిలాహతి బడదు శస్త్రంబుల,
గూలదు రాళ్ళచే గొట్టబడదు
పాశంబులనుపట్టు బడదు శస్త్రంబున
నొవ్వదు వానకు నూడిపోదు
వడగండ్లకట్టిట్టు వణకదు యొండను,
యొండదు చలికితా బెదరుపడదు

గీ. గాన యిదినిర్వికారమై కదలకెల్ల
కాల మొకరీతియచలంబు గానుపించు
పుట్టిగిట్టుటలేకను చట్టువలెను
అదియు నీవయ్యశివరామ యఖిలరామా.

క. పుట్టదు గిట్టదు యొరులం
గొట్టదు మరిభక్తిగలిగి గొనియాడినతా
బెట్టదు యుంచుకయైనం
దిట్టదు కోపంబుచేత దిట్టిననైనన్.

క. ఆడదు పాడదు నొరులం
వేడదు మురిభక్తిగలిగి వేల్పులతో నైనం
జూడదు మోహాయని జత
గూడదు యుప్పొంగి మిగుల కోరికతోడన్॥

క. ఆదరదు భయమునుగొని తా
బెదరదు సుత్స్వాహమునను పిలువదు మదిలో
వదరదు నట్టిట్టని తా
కదలదు పెనుచట్టు భాతి గా శివరామా.

క. అరుగదు విరుగదు నేమియు
నెదుగదు యిదివింతలనుచు యన్యాళ్ళకు తా
యరుగదు తరుగదు అగ్నికి
కరుగదు నీరంబు భాతి గా శివరామా.

వ. అనివంచబంధవిముక్తుని గా నొనరించి శేషహాసీంద్రుండు శివరామయోగికిట్లనియె॥

సీ. పూర్వజన్మము నీకు పుట్టుపోలికె లేదు,
మళ్ళిజన్మకు రావు మహిని యందు
తల్లిదండ్రులు లేరు తర్కించిచూడంగ,
దానిసంభవమును యోనికి లేదు
నాదు కరుణయు లేక నఖిలశాస్త్రంబులు,
చదివిచూచితివయ్య నంతగనక

యుండుకుమీకింక నితరశాస్త్రంబుల,
పొందుజూడక నీవు జెందుబయలు

ఆ.వె. యనుచు గురుడు దెల్ప వినిశిష్యరూగణంబు
పంచభూతఘటము పెంచులయ్యె
లోకభౌతికముల లోజేరినవిహారి
శిష్యశ్రీములుదీరి స్థిరముసుందె.

క. గురుభక్తిగలిగియే స
త్పురుషుండీ పంచబంధముల క్రమమెల్లం
మరుపక చదివిన శ్రీ న
ద్గురుడొసంగున ఖండపదవి కోరికలరయన్.

ఓం.

శ్రీమద్గురుపరబ్రహ్మణేనమః.

శ్రీఅచలగురు శంకరాచార్యగురవేనమః.

శంకరాభరణమురాగము.

(1) నిన్నేనమ్మితిగురు- నాధశంకరమూర్తి- నన్నుగావు టకీర్తి- యెన్నివిధములనైన- నన్నుతించితిగాని - మిన్నకుండుటేమి॥ స్వామి॥ నిన్నే॥ యురగభూషణభక్త- వరునిపార్థనవిని-వర ములొసగవేమి- వరమాపూరుషనన్ను - వరునిగజూచుట - వంత ములదేవా- .బ్రోవ॥ నిన్నే॥ మాయరహితుడనిన్ను- వేయువిధము

లనేను- వేడుచుంటిస్వామీ- కాయమస్థిరమయ్యె- కలకాలమువే
డ- ప్రాయమెంతయూ లేదే- పోదే॥ నిన్నే॥ భక్తియుక్తియుగాని-
ముక్తిదాయకుడాని- మురయుచుంటి దేవా- రక్తిగానినువేడే రసి
కాగ్రగణ్యులెపుడు- శక్తిరహితమై- శాశ్వతపదమంటిరే- గం
టిరే॥ నన్నే॥ పరులనిందలుబాపి- పరిపూర్ణమునుజూపె- పతితపా
వనుడనువాని- వరదా సూర్యకాంతం- మరిమారివేడిన- మరచి
యుండుటేల- వీలా॥ నిన్నే॥

## కాంబోజిరాగము.

(౨) గురునిమినా వేరొకదైవము-మరిలేదునినవే- ఓమనసా
సవగునసద్గురుని మరువకదలచితే-వరమునొందేవేనీ॥ వోమనసా॥
యీషణత్రయములు కాసుకోనున్నవి మోసముచేసునె వో
మనసా కోశములపైవెల్గె యీశునినమ్మితే మోసము నొందవువో
మనసా ॥గురు॥ గొప్పవాడననియెప్పుడు బలుకుముప్పును జెందేవు
ఓమనసా- తప్పకసోహమును యెప్పుడు తలచితే ముప్పను జెందావు
ఓమనసా॥ గురు॥ యిలలోను నావంటి బలవంతు లెవరనుచు
పలుకుచు నుండకే- ఓమనసా- కలలోశరీరము లేలాగునుండునీ
వాలాగుగొలియవే- వోమనసా॥ గురు॥ చుట్టాలు నెచ్చెలుల
చూచుకొని నీవు మిట్టిపడుచునుండకు-ఓమనసా- దిట్టముగ యముడు
కట్టియీడ్చుకపోతె చుట్టాలు రారెవరు-ఓమనసా-యేమిలేనిబయలై
స్వామిశంకరుడుండె కామాదులను బాపు- ఓమనసా- ప్రేమతో
సూర్యనారాయణుని బ్రోచినసామిని నమ్మిమి- ఓమనసా॥ గురు॥

## కాంభోజిరాగము.

(3) తనువునిత్యమా- మనసా॥ తను॥ అనృత మాడుటకు వెనుకదీయవైతివి॥ తను॥ ఘనులవిడచియా- ఘనులతోటిగూడి- అనుదినమున పనిబాటలు- ఘనముగ జేసినీ॥ తను॥ నిత్య సత్యవ్రత మనే- సత్యవాక్కు- నెరుగలేక- అత్యంతము హీనుల వాక్యము- సత్యమనుచు జనుల నమ్ముట॥ తను॥ సాధువైన శంకర గురుపాద మందలేక భువిని- వాదాభేదము నొందుచు- నాదినీది యనుచునుడి వెదవు॥ తను॥ ఆర్యులెన్నైబోధవిడచి- శౌర్యమైన పనులజేసె ధై ర్యత్వమునకువరదా- సూర్యనారాయణయని మొరిగెవు॥ తను॥

## శహానరాగము.

(4) గురుని విడనాడకేమనసా॥ గురు॥ హరిహరాదులకు నెల్ల- వరుడై వెలసినస్థిరముగ॥ గురు॥ కర్మరహిత మనసుగాంచి కామక్రోధములనుద్రుంచి- నిర్మలుడై నిజపదమున- నిండియున్న వాడు॥ గురు॥ రాగద్వేషములను బోక- రాకపోక యెరుగలేక- ప్రాకటముగ సర్వంబును- ప్రబలుచునుండేటివాడు॥ గురు॥ ఆగా మిసంచితముల- యంటకుండ దుంచివేశి- రోగుల హృదయ గ్రంధిని- యందునుండకుండ జేసిన॥ గురు॥ సూర్యనారాయణను బ్రోచి- సూరిజనుల మెచ్చజేసి- ధర్మాధర్మములనురోసి- ధరను శంకరుండై వెలసెను॥ గురు॥

## శహానరాగము.

(5) గురునాథ బాపుమింక- యెరుక మరవుశంక॥ గురు॥ పరిపరివిధ మేవంక- పరువిడకుండనింక॥ గురు॥ బంధమోక్షముల

నింక- బాపెదవని నీవంక- జెందియుంటి నేనింక- జాగు సేయకుమింక॥ గురు॥ లేనిమాయయందు- లేక నేవచ్చితిందు- ననయము నీపొందు- సంటియున్నానిందు॥ గురు॥ యుపాధిద్వయము లేని- యుచిత వాక్యము విని- కృపకటాక్షుడవని- కోరియుంటిపూని॥ గురు॥ పుట్టుగిట్టుటలద్రుంచె- పుణ్యుడవనియెంచె - పట్టియుంటినను గాంచె పరమపదమునందుంచె॥ గురు॥ ధర సూర్యదానపోష-పరమపురుష యీశ-పరశంకర గుర్వీశ॥ మరిమరి వేడితి పరమేశా గురు॥

## సావేరి రాగము.

(6) తారకయోగము తెలియుట యున్నది తత్వవేత్తలకు నిజమయ్యా॥ పూరికై దిరుగక సద్గురువాక్యము- వంచన లేకను వినరయ్యా॥ తార॥ అండపిండబ్రహ్మాండము వెలిలో- కుండలిమధ్యను గనరయ్యా ఖండఖండములు గాకయెప్పుడును కర్మరహితమై వెలుగునయ్యా॥ తార॥ ఆరుచక్రముల అటు యిటు దిరుగుచు- మీరి సుషుమ్నను గనరయ్యా వేరుగాక యయమాత్మ బ్రహ్మమై- యార్యులవాక్కున నలరెనయ్యా॥ తార॥ ఆత్మ వేరు పరమాత్మ వేరని- యనుటగాదు మరివినరయ్యా- ఆత్మానాత్మలు రెండు తెలసియు అహంబ్రహ్మమనుచుండరయ్యా॥ తార॥ వేయిదళములకిరువైసర్వము, వెల్గుచున్నది చూడరయా బాలకశంకరు గురువాక్యాంతట భవముల ద్రుంచేవరమయ్యా॥ తార॥ గురుపాదంబుబున గురుతుగలిగిన గుణరాహిత్యుల గాంచరయ్యా- ధరణిలో వరదా సూర్యనారాయణ తరచిచూచుచుండిన దేనయా॥ తార॥

## శహానా రాగము.

(7) హంసను దెలియవలెరా - జీవా॥ హంసను దెలియవలెరా హంసను దెలియు సంసారము రోసే- హింసలు జెందని- కంసారని యే పర॥ హం॥ సుషుమ్నాంతమున సూక్ష్మముతానై- విసరుచు వుటముల వశమై యుండే- పర॥ హం॥ పంచరంగులలో మించి ప్రణవమై సంచితంబులను త్రుంచివేసే- పర॥ హంస॥ మేటిసహస్రమున నాటిశబ్దముల- కూటమందు గురు సూటియైన పర॥ హం॥ ఆరుమెట్లపై కోరినిలుచుచు మీరి సోహమని దారిజూపె పర॥ హంస॥ ఆర్యలకెల్లను మేరువౌశంకరా-చార్యుల పాదముజేరి యున్న పర॥ హంస॥ గురుకటాక్షమున సూర్యనారాయణ- మరుగు దెలసితా పరమై యున్న పర॥ హంస॥

## సురటరాగము.

(8) గురునకు మ్రొక్కరేమి- నరులారమీ॥ గురు॥ గురునకు మ్రొక్కినసరగున మీకిపుడు - విరుగు తనుగులు లేని- పరిపూర్ణమును జూపు॥ గురు॥ బోధనేమియు గాదు- నరులారమీ-సాధనేమియు లేదు- ఆదియనాది యనేది నెరుగకుండ- సాధనరహితమై సమరాసమై యున్న॥ గురు॥ పండవెన్నెలగాదు- నరులారమీ- దండిచీకటిలేదు యెండమావుల వలె- నుండిన ప్రపంచ- ముండిన పోయిన- రెండు గుర్తెరుగని॥ గురు॥ దేవపూజలు గాదు- నరులారమీ భావమెన్నడు లేదు- దేవదేవ మమ్ముబ్రోవు మనిన గాని- భావమెన్నడు లేక బట్టబయలై యున్న॥ గురు॥ శోడశాక్షరి భావము

నరులారమన- మేడజూచినగానము- ఆడయాడనపండ యేడేడు
లోకములు- నిండేద్వాదశాక్షరేదేడజూచిన॥ గురు॥ అరుగుకను
గులుగాకను- నరులారమీ- వారుగుపొరుగులులేకను- ధరలోశం
కరగురుని- మరుగుదెలిసినపుడే- వరదా సూర్యనారాయణ వర
మాపదమై వెలసె॥ గురు॥

## శంకరాభరణరాగము.

(9) గురుబోధవినండి- పరమపురుషులార॥ గురు॥ పరిపా
రివిధముల పరువులుబారక॥ గురు॥ భక్తిమార్గముకాదు - ముక్తి
జెందుటలేదు - శక్తిరహితమయిన - శాశ్వతపదమనె॥ గురు ॥

సాధనేమియులేదు భేద భావముగాదు . ఆదియంతములేని-
యచలమై వెలిగేటి॥ గురు॥ మండలిశక్తిగాక దండిపొరువులులేక-
అండపిండాదుల నిండియున్నవైభుడు॥ గురు॥ హరిహరాదులుగాక-
ఆయాపదవులులేక-మరపుతెరవునుగాక పరమపదమనిబరగు॥ గురు॥
మూడునాల్గునుగాక మూడవస్తులులేక- యేడజూచినబయలు వేడు
కైయున్నది॥ గురు॥ ఎందరులేదనిన యెందుజూచినగాని నందునం
దులయందు పొందియున్నదినిజము॥ గురు॥ పదియారక్షరములు పరి
కించుటెరుకయ్యె- పదిరెండక్షరము లు పరిపూర్ణమై ప్రబలె॥ గురు॥
ధరనుశంకరగురుని పరవాక్యమువిని పరమార్థమనిదెల్పె- వరదా
సూర్యనారాయణ॥ గురు॥

## సురటరాగము.

10 బయలోకనమని నమ్మబోకుడీ సద్గురునాజ్ఞ ద్వయముతే కున్న తెలియుడీ- రయమున గురునిజేరి- ద్వయములేని బోధ- నయముగా దా పొందిన - భయములన్ని యుతీరు॥ బయ॥ శత్రుచిత్తులనైరుగాక సద్గురునాజ్ఞ వృత్తబయలై మెరయగా - కత్తులనరికిన తత్తారజెందకుండ- చిత్తముకుదొరకక మొత్తమై యున్న దేవుడు॥ బయ॥ వ్యాపకములబొందదూ- సద్గురునాజ్ఞ- పాపములను జెందదూ- రూపనామములేక రూఢిగ వెలుగుచు - నాపదసంపద ననిశాము నైరుగకుండ॥ బయ॥ కామక్రోధములొందదూ సద్గురునాజ్ఞ ప్రేమాదులనుజెందదూ- నీమముతో జనుల - నఖిలభక్తిజ్ఞాన ప్రేమతో జేసిన యేమానకున్న దెవుడు॥ బయ॥ ఆకాలిదప్పినైరుగాక- సద్గురునాజ్ఞ యేకాలమునగదులాక లోకత్రయముతనలో- నేకమై దిరిగి యున్న చేకొనకుండక నేకమై యున్నదదుగో॥ బయ॥ కోపములను బొందదూ- సద్గురునాజ్ఞ తాపములను జెందదూ- దీపమువలె కనుపాపలో మెరుకను రూపమెట్టిదో తెలక రూఢిగ నిలచి యున్నది॥బయ॥ రాకపోకలులేకను సద్గురునాజ్ఞ యేకమై ప్రబలగానూ - లోకలోకము వారు చీకాకైనగాని బోకతోడుత వారి - బోలెరుగకున్న దేమో॥ బయ॥ కార్యకారణములేకా సద్గురునాజ్ఞ స్థైర్యస్థైర్యములుగాకా- ఆర్యశంకరగురుని యందితెలసినవుడె- సూర్యనారాయణ చూచుచున్నదినిజము॥ బయ॥

## సావేరిరాగము.

॥ నమ్మబోకుండి నమ్మబోకండి-యీయెరుకనెపుడు॥నమ్మ॥
నమ్మబోకుడి నమ్మబోకుడి నమ్మతమును యెరిగిమరచు సుమ్మదీని
గుణములింతే- బొమ్మలాటగ దెలసిమీరు॥ నమ్మ॥ పంచభూతాముల
ను దెల్పొచు- యీయెరుక యెపుడు- పంచి యిరువాదైదనానుచూ-
పంచియిరువదైదునను మించిప్రణవానాదమూని- యెంచిచూచిని
లకతనలో సంచితములుజిక్కినవైను॥ నమ్మ॥ అహంభావమూనని
ల్చియు- యీయెరుకనైపు సోహంసోహమూనిబల్కియు- సోహం
సోహమూనబల్కి మోహమూనజెందియుండిదోహములులేనట్టిబయ
లన- అహయేమియులేకపోయెను॥నమ్మ॥ అంచితముగారంగుల్రగ
మును-యీయెరుకయెపుడు యెంచిహృదయస్థానమూనెనూ- యెంచి
హృదయస్థానమూనమించిఆపోద్యోతినిలిపి-మంచికళనుజూచుచును
తా- కొంచెమైపోవుచున్నది॥నమ్మ॥ ప్రకృతిపురుషులైవెలయునూ-
యీయెరుకయెపుడు- సుకృతమూలుదెల్పుచుండునూ- సుకృతమూ
లుబల్కుదీని వికృతమూలుజూచియార్యులు - నేకృతములు జేయు
కుంటే ప్రకృతిపురుషులుదోచమండెను॥ నమ్మ॥ అండపిండాముల
కుపైగాను- యీయెరుకయెపుడు- కుండలీశక్తిదెల్పునూ- కుండలీ
శక్తినిబ్రహ్మాండమంతట- నిండివెలుగుచు- దండియైన యచలబో
ధను- యెండమావులట్లుదోచె॥ నమ్మ॥ ఆదియంతము లన్నిదెలియూ
ను-యీయెరుకయెపుడు- గాధలెన్నియొబల్కుచుండియూ- గాధ
లెన్నియొబల్కియితర- భేదమూనపెద్దలాతో వాదమూలు జేసిగు
రుని- బోధయందేనిలువకున్నది॥ నమ్మ॥ పరమపురుషుల పల్కు

లందునా- యీమొరుకయెపుడు- పరిపరివిధములబొందునా- పరిప
రివిధములబొందక- వరదసూర్యనారాయణ- ధరనుశంకరగురు
నిహితము- మరుగుజేరినదెపుడులేదు॥ నమ్మ॥

## శంకరాభరణరాగము.

12 ఎన్నటికినమ్మరాదురా- యీమొరుకునెపుడు- సున్న
గానేచూడవేమిరా॥ ఎన్నటికినమ్మరాదు ఎన్నివిధములైనగాని-
కన్నెలుపురుషులైనకలా- కర్మములునిండించిపోను॥ ఎన్న॥ దేవ
భాంతిగలిగియుండురా- యీమొరుకయెపుడు- బోధ్రవరేయని పలు
కుచుండురా- దేవభ్రాంతిగలిగియుండి కేవలాము కేశవాదుల- త్రో
వగానకతిరిగితిరిగి- యేవిధమునజిక్కియున్నదో॥ ఎన్న॥ కలలో
దేహములల్లైరా- యీమొరుకయెపుడు- ఫలముగానబరగుచుండురా
కలలోదేహములల్లై- తలచాకస్వర్గనరకము- కలదంచుతననెతా
ను- గునగొంటెలేకపోయెను॥ ఎన్న॥ పరులునేననిభావమందిరా-
యీమొరుకయెపుడు- కరుకువాదామాడుచుండురా- పరులునేనని
భావమంది పరిబరివిధములదిరిగి- ధరనుసంసారమునదగిలి- దారు
పురుషునిచందమాయె॥ ఎన్న॥ సకలధర్మాధర్మముజూచురా-యీ
మొరుకయెపుడు- వికలముగానబొందియుండురా- సకలధర్మాధర్మ
ముజూచి- సర్వసాక్షిననుచుదెలసి- యకలంకమైతిననిన - యాకా
శపుష్పమునబోలె॥ ఎన్న॥ బట్టబయలు నొందలేకరా- యీమొరు
కయెపుడు- మొట్టమొదటనె లేకయుండెరా- బట్టబయలునొందలేక
పుట్టుగిట్టుటలనుబొంది- అట్టెజూచిన వంధ్యాపుత్రిని - గుట్టుమై

యున్నాదిగనుము॥ఎన్న॥ ధరనుశంకరగురునిజేరరా- యీయొరు కయెపుడు- మరియుచుతామన్నరాదురా- ధరనుశంకరగురునిజేరి వరదసూర్యనారాయణ పరమపదమునందినపుడే- మరిమరిచక మా ౘ నెరుక॥ఎన్న॥

## శహనా రాగము.

(13) నిండియున్నదిచూడలేరైరి- పరిపూర్ణమంతట॥నిండి॥ నిండియున్నదిచూడలేక- యండమావులట్లుదోచు- కొండగోపురములవద్ద- గూడితపములుజేసుకేల॥నిండి॥ దండిభావము గంటిమంచును- పరిపూర్ణమెరుగక- పండువెన్నెల బయలటంచునూ- దండిభావముగంటిమంచు- మెండుగాగెడ్డములుబెంచి- యొండవానలనకదిరిగి- గుండకొయ్యలవలెగాని॥ నిండి॥ ధ్యానదానములనునల్పుచూ- పరిపూర్ణమెరుగక- ప్రాణహానములనుదెల్పుచూ- ధ్యానదానములనుసల్పి- మోనిసంభవమంచుదెలియక- నేనుతానైబ్రహ్మమనుచూ- పూనివాక్యము బల్కేటేల॥నిండి॥ షడచక్రాములెల్పుచూ- పరిపూర్ణమెరుగక- యాడయాడను నిల్పిచూపుచూ- షడచక్రాములనునిల్పి- యీడపింగళనాడులందున- వేదుకాతోదిరుగుహంసను- గూడిబట్టినబ్రతుకగలదని॥ నిండి॥ యక్షరాజవిధము దెలియరూ- పరిపూర్ణమెరుగక- మోక్షపదవులు గోరుచుందరూ- యక్షరాజవిధముదెలియక- సాక్షినీవని యహముదెల్పు- టాక్షేత్రక్షేత్రములనుయెరుకని- సిక్షమాత్రము దెలియలేక ॥ నిండి॥ మూలమూలేదని తెలియరూ- పరిపూర్ణమెరుగక- కాలమూనుగడు

వుచుండేరూ- మూలము లేదని తెలిసిన - యేలయీ గుర్తెరిగితను పు-
చాలుచాలునయేమి లేదని- వీలుగా గురువాక్యమెరుగక॥ నిండి॥
కాయశుద్ధియె నిక్కమంచునూ - పరిపూర్ణమెరుగక - ప్రియ
మెంతయు దెలియకుంచునా- కాయసిద్ధియె నిక్కమంచు- వేయు
విధముల యోగసాధన- జేయుచుండిన మితము దెలియక - మాయమై
పోయ్యేటి తనువై॥ నిండి॥ భ్రాంతిరహితమె మోక్షమన లేరు- పరి
పూర్ణమెరుగక- శంతుజనకుని గొలచియుండేరూ - భ్రాంతిరహిత
మె మోక్షమని- కాసింత శంకరు గురుని వాక్యము - సంతతాము జూ
చువారికి చక్కగ పరిపూర్ణమయ్యె॥ నిండి॥ పొందబోరు పరమపద
మూనూ- పరిపూర్ణమెరుగక- నందియమునూ దీరకుండున-పొంద
బోరు పరమపదము- యెందు జూచిన సందులేనిదె- అందియున్న నూ
ర్వకాంతము- నందియములు దీరినపుడె॥ నిండి॥

## ఆనందభైరవిరాగము.

(14) పంచదశాక్షరి నంటిచూడరా- ప్రపంచమంత- గాం
చుటకు స్వప్నమాయెరా- పంచదశాక్షరినంటిచూడక - సంచితము
నుజిక్కెననుచు- గాంచనేరక భ్రమలజిక్క - గలదంచును- ఫల
మంచును- యిలనంచును- విలపించెవు॥ పంచ॥ పుత్త్రభ్రమనుబొం
దబోకురా- ప్రపంచమంత - చిత్రచిత్రములను నుండెరా - పుత్త్ర
భ్రమనుబొందియుండి- సత్తుచిత్తని రెంటివేర్వేరు - చిత్తవిభ్రమల
చేతజిక్క- జీవుండని- దేవుండని-గావుండని- భావించుట॥ పంచ॥

రాజయోగము సూటిదెలియరా- ప్రపంచమంత- గాజుకడియము
లయ్యెచూడరా - రాజయోగము సూటిదెలియక - రాత్రిపగలు
నిష్ఠజెందియు- సజాడెసర్వమయుడటంచు- నాదలబని- ఖేదంబున-
వాదంబున- గాదంబడక॥ పంచ॥ యీవృత్తిబట్టబయలుగాంచరా-
ప్రపంచమంత- రవినిగాంచినచీకటాయెరా- యీవృత్తిబట్టబయలు
గాంచక- ఈశ్వరత్వమందెననుచు- కోవిదులనుగాంచినపుడె- ఖం
బ్రహ్మని- హంబ్రహ్మాస్మి- తత్వంబ్రహ్మని- సర్వంబ్రహ్మనుట॥ పంచ॥
ధరను శంకరగురునిజూడరా ప్రపంచమంతదారు పురుషుని చం
దమాయెరా- ధరనుశంకర గురునిజేరక-దైవమానసుగాభ్రమనుచు
పరిపరి విధములవేడియు- పతితుండనుగతిలేదని సతతంబును స్తుతి
వేడుట॥ పంచ॥ వరసూర్యకాంతము బాటజూడరా- ప్రపంచ
మంత మరిమరీ చకముగ మీటెరా- వరసూర్యకాంత ముబాట
జూడక వెరవుచేత హరిహరులను- ధరను లోనగిబ్రోవుమనుచు
వందనమిది- పొందుమనది- యెందునగతి- గందననుట॥ పంచ॥

## శహానారాగము.

(15) నిత్యకృత్యాదులనుగావు- నిజమునిటకడ దెలియరా-
సత్యసాక్షై- సర్వజగములు- సంతతమునిండుండెరా॥ నిత్య॥ కామ
క్రోధాదులనుమించి- కర్మములుదెగనాడెరా- యేమిలేనిదియేమినా
నిది- యేమిటోగనియుండరా॥ నిత్య॥ జననమరణము సుఃఖదెవ్వ
దం- జగతికొలిలోనుండెరా- ఘనమనీచమంతెన్నవారికి- గానరా

చున్నాదిరా॥ నిత్య॥ పరులు నేననే భావమందె- పలుకునను గనరా దురా- వరదుడౌశివరామదీక్షిత వాంఛయిదిగనియుండరా॥ నిత్య॥ రజ్జుసర్పభ్రాంతివలెనని- ముజ్జగంబులు గాదుగా- యర్జునాదులు వేడినప్పుడు- యాదికృష్ణునిబోధరా॥ నిత్య॥ భవము తానని గుందుటకు ను- బంధమోక్షము గాదురా- సవినయంబుగ కృష్ణదాసుని- సత్య వాక్యము నమ్మరా॥ నిత్య॥ ధర్మకర్మవ్వందమెరుగని - ధరను శం కరబోధరా - నిర్మలంబై సూర్యకాంతము - నిత్యపదవిని బొంది దెరా॥ నిత్య॥

## సారంగరాగము.

(16) బట్టబయలు గనుగోనండి - సత్పురుషులారా - బట్ట బయలుగనుగోనండి॥ బట్టబయలుగనుగొనుటకు- గుట్టుయైన మెరుక మూలము - మొట్టమొదటకుదృంచివేసే- దిట్టమైనా గురునివాక్కు- చే॥ బట్ట॥ వట్టిమాటలు గావువీనండి- సత్పురుషులారా- పట్టువిడువు లు లేకనిలుచుండి- వట్టిమాటలు గావుభ్రమల- బెట్టకను సర్వంబు తానై- చట్టవలెను గదలకుండగ- చక్రగా నిలుచున్నదంతట॥ బట్ట॥ మెరుకమరుపులు లేకచూడండి- సత్పురుషులారా - మరుగు యేమియు లేదుగూడండి- మెరుకమరుపులు లేకసర్వా- దురితములనె డబాపి[illegible]ర్ణుల- వరకుపదమై వెలసియున్నది- పతితులకుగనరాని దెప్పుడు। బట్ట॥ కులముగోత్రము భ్రాంతివీడండి- సత్పురుషులారా-

స్థలముఫలమును గోరబోకండి- కులముగోత్రము వీడినసద్గురు- నెల
వునందుననిలిచియున్నను- కలుషములుదెగవాడిస్థిరమై- కంటిముం
దరనిలచియున్నది॥ బట్టు॥ పరతత్త్వపదముబొందండి- సత్పురుషు
లారా - తరతరాభావములు వీడండీ - పరతత్త్వపదముబొందిన-
ఘోరసంసారాబ్ధిజలధియు- వారినికలలో గాంచిమ్రగ్గిన-కరియు
కరణిగవీడిపోవును॥ బట్టు॥ వేదశాస్త్రముగాదుచూడండి - సత్పురు
షులారా - బాధలన్నియు తొలగిపోవండి - వేదశాస్త్రముగాదువె
కుర- గాధలోబడియుండబోక - మోదములరగ శంకరార్యుని -
పాదమందుమనసునిలిపి॥బట్టు॥జనన మరణము లేదుచూడండీ సత్పు
రుషులారా-ఘనము నీచములెన్నబోకండీ- జననమరణము లేకన
నయము జగతికెలిలోపూర్ణమైనది - వినయముగను సూర్యకాం
తము మనవిజేసినమాటనమ్మి॥ బట్టు॥

(17) కన్నది విన్నది యన్నదిలేకయున్నదిపరిపూర్ణంబదే
కదా- చిన్నెల మారైచిత్రకళలుతా- కన్నులజూపినదిదేకదా
॥కన్న॥ దారాపుత్రధనాదుల జేరని- ధన్యులబ్రోచిన దదేకదా-
వేరువేరుభ్రాంతులచేరకు వారినిజెందిన దిదేకదా॥ కన్న॥ వేష
భాషలకు వెరపుసుందకను వెల్గుచునుండినదదేకదా- దోషములెం
చినదాసులచేరియు- మోషముబొందిన దిదేకదా॥ కన్న॥ కుల
గోత్రములనే కుటిలమోహమును- కూలద్రోసిన దదేకదా- కల
కాలంబున కర్మకానిజమని- కాలముగడిపిన దిదేకదా॥ కన్న॥

సంగతి దెలియని దొంగ గురువుల చెంగట నిలువని దదేకదా- అంగ
ములోపల లింగమున్నదని భంగము జెందిన దదేకదా॥ కన్న॥
తానుతానను తత్వము దెల్పిన తరువును చెదని దదేకదా- మాను
గజములకు మేనుజనాల్గని మేదిబలికెనదిదేకదా॥ కన్న॥ పంచ
భూతములయొంచిన యెరుకను ద్రుంచివేసినాదదేకదా- సంచితంబు
లను చక్కగ దెంచినియు కీర్తిచను జెందిన దదేకదా॥ కన్న॥ యెరు
కప్రపంచము వేరువేరని యెరుగకుండిన దదేకదా- మరపుతెరపు
లను మాయలజిక్కియు వరుపిడుచుండిన దదేకదా॥ కన్న॥ ధర
ణిలో శంకరగురువగు దెల్పిన ద్వైతశిఖామణి యుదేకదా- పరదా
సూర్యనారాయణవాక్కున వర్ణనజేసినదిదేకదా॥ కన్న॥

## కీర్తన.

(18) పరమాపదమును- బొందేరు- సత్పుణ్యులార పరమా
పదమును జెందేరు॥ పరమాపదము నేబయులు గురుకృప గల్గకున్న
హరిహరాదులకైనా- యలవిగాకున్నా దనెడు॥ పర॥ ఆరు మత
ములుగానిదీ - తారకసాక్ష్యంబని - వేరు భావములేనిది - దారి
గాని నిగుకుల జేరి యుపదేశంబును- కోరిపొందిన వారిని జేర
కున్నది దెలసి ॥పర॥ జడమనే పదమునెరుగదు- సదమలత్వమున
జడమనేపదముకరుగదు- విడివీడిబోధలందక- తడయాక పూర్ణ
బోధ - కడువేగమున బొందిన ఘడియాలో గనుపించిన ॥పర॥
దుర్మదాంధముల ద్రుంచుటు- నిర్మలత్వమున- కర్మాకర్మముల
మించును- మర్మమేమియు లేని ధర్మమై వెలసియున్నది- నిర్మలత్వ

మున మీరునిలచియుండినజాలు॥ పర॥ అండపిండములై పెరుగునా- అనంతమై బ్రహ్మాండమందున తరగున- దండైన యచలభావమున నిండిన పూర్ణబోధకులం- డాబాయక నెపుడుండిన చాలుచాలును ॥పర॥ నేనుమీరను పదము లేనిది- సుస్థిరముగాను మేలైన తావు గానిది- మూలుగ సర్వజనులు- పూనుడీ రుచి నెరింగిన- కనబడు చున్నదదుగో కనుమరుగింతైన లేక॥ పర॥ ధరలో శంకరాచార్యులు- సంపూర్ణబోధ- పగులకు దెల్పుధీరులు- అరమర లేక గురుని చరణాద్వయము జేరి- పరదా సూర్యనారాయణ స్థిరముగ సూచనిదియని ॥పర॥

క. మంగళము నిరామయునకు
మంగళము నిరంజనునకు మహనీయునకున్
మంగళము యచలవేత్తకు
మంగళమని మదినిదలతు మద్గురుచంద్రా.

సంపూర్ణము.



